శ్రీకృష్ణునియెడల అనన్యభక్తియుక్తులై ఈ శ్రీబ్రహ్మవైవర్తమహాపురాణమును శ్రవణమొనరించువారు అసంఖ్యాకపూర్వజన్మలందు తామొనరించిన పాపములనుండి ముక్తులై, పరమపవిత్రులై శ్రీహరి యనన్యభక్తిని, దాస్యసౌభాగ్యమును పొంది అంత్యకాలమున గోలోకపరంధామము చేరగలరు.

విప్రవరులారా! ఇట్లు నేను నాగురుదేవుని శ్రీముఖారవిందమునుండి శ్రవణమొనరించిన, శ్రీబ్రహ్మవైవర్తమహాపురాణమును మీామెదుట వర్ణించితిని. ఈపవిత్రనైమిశారణ్యములో గూడిన సద్విప్రసమాజమును దర్శించి నమస్కరించుటకే నే నేతెంచితిని; మహాత్ములైన మీాయాజ్ఞను శిరసావహించి ఈ దివ్యపురాణమును సాంగోపాంగముగ వర్ణించితిని. మహర్షిశ్రేష్ఠులారా! నేను పవిత్రనారాయణాశ్రమమునకు ప్రస్థానమొనరింపవలెను కావున నాకు కృపతో అనుజ్ఞదయచేయుడు.

శ్లో॥ నమోఽస్తు బ్రాహ్మణేభ్యశ్చ కృష్ణాయ పరమాత్మనే ।
శివాయ బ్రహ్మణే నిత్యం గణేశాయ నమోనమః ॥ 71

కాయేన మనసా వాచా పరం భక్త్యా దివానిశమ్ ।
భజ సత్యం పరం బ్రహ్మ రాధేశం త్రిగుణాత్పరమ్ ॥ 72

నమో దేవ్యైః సరస్వత్యైః పురాణగురవే నమః ।
సర్వవిఘ్నవినాశిన్యైః దుర్గాదేవ్యైః నమోనమః ॥ 73

సద్బ్రాహ్మణులైన మీకు నానమస్కారము, పరమాత్మయైన శ్రీకృష్ణునకు నమస్కారము. శివునకు, బ్రహ్మకు, గణేశ్వరునకు నిత్యము అనేకానేక నమస్కారములు. సత్యస్వరూపుడైన, రాధాప్రాణేశ్వరుడైన, త్రిగుణాతీతుడైన, పరబ్రహ్మమైన శ్రీకృష్ణపరమాత్మను మనోవాక్కాయకర్మలచే పరమభక్తిపూర్వకముగ అహర్నిశములు భజింపవలెను. సంపూర్ణవిఘ్నములను వినాశమొనరింపగల దుర్గాదేవికి అనేకప్రణామము లర్పించెదను. శౌనకాదిమహర్షులారా! మీాపుణ్యప్రదదివ్యచరణసరోజములను దర్శించి నేను నేను శ్రీగణేశ్వరుడు విరాజమానుడై యున్న సిద్ధాశ్రమమునకు పోవలయు నని సంకల్పించితిని.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి శ్రీకృష్ణజన్మ ఖండములోని నారదనారాయణ సంవాదమున శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణ మహాత్మ్యమను నూటముప్పదిరెండవ అధ్యాయము సంపూర్ణము.

ఇది శ్రీకృష్ణపరమాత్మ దివ్యచరణారవింద మిళిందాయమాన మానసత్వ
మహావైభవ సంపన్నులైన శ్రీమట్టుపల్లి వేంకటమహాలక్ష్మి
జగన్నాథుల తనూభవుడు భక్తజన దాసానుదాసుడు
సుజనవిధేయుడు నగు శివసుబ్బరాయగుప్తచే
ప్రణీతంబైన శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త
మహాపురాణ మను వచనకావ్యమందు
శ్రీకృష్ణజన్మకాండాత్మకమైన
ఉ త్త ర భా గ ము
సం పూ ర్ణ ము.



శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణము సర్వము సంపూర్ణము
శ్రీ హరిః ఓం తత్ సత్